## అథ త్రిపంచా శత్తమోeôధ్యాయః

## శివుని కైలాస యాత్ర

బ్రహ్మోవాచ|

అథ విష్ణ్వాదయో దేవా మునయశ్చ తపోధనాః | కృత్వా వశ్యకకర్మాణి యాత్రాం సంతేనిరే గిరేః || 1

తతో గిరివరస్స్నాత్వా స్వేష్టం సంపూజ్య యత్నతః | పౌరబంధూన్ సమాహూయ జనవాసం య ̧° ముదా || 2

తత్ర ప్రభుం ప్రపూజ్యాథ చక్రే సంప్రార్థనాం ముదా | కియద్ధినాని సంతిష్ఠ మద్గేహే సకలైస్సహ || 3

విలోకనేన తే శంభో కృతార్థోeô హం న సంశయ ◌ః |ధన్యశ్చ యస్య మద్గేహ ఆయాతోeôసి సురైస్సహ || 4

బ్రహ్మ ఇట్లు పలికెను-

అపుడు విష్ణువు మొదలగు దేవతలు, తపోధనులగు మునులు అవశ్యమగు పనులను పూర్తి చేసుకొని కైలాసయాత్రకు సన్నద్ధులైరి (1). అపుడు హిమవంతుడు స్నానము చేసి ఇష్టదైవమును శ్రద్ధగా పూజించి పౌరులను బంధువులను దోడ్కొని పెళ్లివారి మకామునకు వెళ్లెను (2). అచట శివప్రభుని ఆనందముతో పూజించి ఇట్లు ప్రార్థించెను. నా గృహములో కొద్ది రోజులు అందరితో కలిసి నివసించుము (3). హే శంభో! నిన్ను దర్శించుట చేత, దేవతలతో గూడి నీవు నా ఇంటికి వచ్చుట చేత నేను కృతార్థుడను, ధన్యుడను అయితినసుటలో సందేహము లేదు (4).

ఇత్యుక్త్వా బహు శైలేశః కరౌ బద్ధ్వా ప్రణమ్య చ | ప్రభుం నిమంత్రయామాస సహ విష్ణు సురాదిభిః || 5

అథ తే మనసా గత్వా శివ సంయుతమాదరాత్| ప్రత్యూచుర్మునయో దేవా హృష్ట్వా విష్ణు సురాదిభిః || 6

పర్వతరాజు ఈ తీరున చేతులు జోడించి నమస్కరించి విష్ణువు, దేవతలను, ఇతరులను, శివ ప్రభుని అనేక విధములుగా ఆహ్వానించెను (5). విష్ణువు మొదలగు దేవతలతో గూడిన మునులు శివుని సాదరముగా మనస్సులో స్మరించి అపుడిట్లు బదులిడిరి (6).

దేవా ఊచుః |

ధన్యస్త్వం గిరిశార్దూల తవ కీర్తిర్మహీయసీ | త్వత్సమో న త్రిలోకేషు కో**eô**పి పుణ్యతమో జనః || 7

యస్య ద్వారి మహేశానః పరబ్రహ్మ సతాం గతిః | సమాగతస్సదాసైశ్చ కృపయా భక్తవత్సలః || 8

జనావాసో**eô**తిరమ్యశ్చ సమ్మానో వివిధః కృతం | భోజనాని త్వపూర్వాణి న వర్ణ్యాని గిరీశ్వర || 9

చిత్రం న ఖలు తత్రాస్తి యత్ర దేవీ శివాంబికా | పరిపూర్ణ మశేషం చ వయం ధన్యా య దాగతాః || 10

దేవతలిట్లు పలికిరి-

ఓ గిరిరాజా! నీవు ధన్యడవు. నీ కీర్తి చాల గొప్పది. ముల్లోకములలో నీ అంతటి పుణ్యాత్ముడగు జనుడు మరియొకడు లేడు (7). పరబ్రహ్మ, సత్పురుషులకు శరణము, భక్తవత్సలుడు అగు మహేశ్వరుడు తన కింకరులతో గూడి నీఇంటికి దయ చేసినాడు (8). ఇచటి విడిది చాల సుందరము గనున్నది. వివిధ సన్మానములను చేసి యుంటివి. ఓ పర్వతరాజా! అపూర్వములైన భోజనములను వర్ణింప శక్యము కాదు (9). దీనిలో వింత ఏమీ లేదు. ఏలయన ఎచట జగన్మాతయగు శివాదేవి గలదో, అచట సర్వము పరిపూర్ణమగును. మేము ఇచటకు వచ్చి ధన్యులమైతిమి (10).

బ్రహ్మోవాచ|

ఇత్థం పరస్పరం తత్ర ప్రశంసాభవదుత్తమా | ఉత్సవో వివిధో జాతో వేద సాధు జయధ్వనిః || 11

అభూన్మంగల గానం చ ననర్తాప్సరసాం గణాః | నుతిం చక్రుర్మాగధాద్యా ద్రవ్యదానమభూద్బహు || 12

తతః ఆమంత్ర్య దేవేశం స్వగేహ మగమ ద్గిరిః | భోజనోత్సవమారేభే నానావిధి విధానతః || 13

భోజనార్థం ప్రభుం ప్రీత్యా నయామాస యథోచితమ్ | పరివారసమేతం చ సకుతూహల మీశ్వరమ్ || 14

బ్రహ్మ ఇట్లు పలికెను-

అచట ఈ విధముగా పరస్పరము గొప్పగా ప్రశంసించుకొనిరి. గొప్ప ఉత్సవము మొదలాయెను. వేదశబ్దము, సాధు కారము, జయధ్వానములు ప్రవర్తిల్లెను (11). మంగలగానము ఆరంభమాయెను. అప్సరసలు నాట్యమాడిరి. వంది మాగధులు స్తోత్రములను చేసిరి. గొప్ప దానములు చేయబడెను (12). అపుడు హిమవంతుడు దేవదేవుని ఆహ్వానించి తన గృహమునకు వెళ్లెను. యథావిధిగా భోజనోత్సవము ఆరంభమాయెను (13). పరివారముతో గూడి కుతూహలము కలిగియున్న ఈశ్వర ప్రభుని ప్రీతితో యథావిధిగా భోజనమునకు తీసుకు వెళ్లిరి (14).

ప్రక్షాల్య చరణౌ శంభో ర్విష్ణోర్మమ వరాదరాత్ | సర్వేషా మమరాణాం చ మునీనాం చ యథార్థతః || 15

పరేషాం చాగతానాం చ గిరీశో మండపాంతరే | ఆసమాయాస సుప్రీత్యా తాంస్తాన్ బంధుభిరన్వితః || 16

సురసైర్వివిధాన్నైశ్చ తర్పయామాస తాన్ గిరిః | బుభుజర్నిఖిలాస్తేవై శంభునా విష్ణునా మయా || 17

తదానీం పురనార్యశ్చ గాలీదానం వ్యధుర్ముదా | మృదువాణ్యా హసంత్యశ్చ పశ్యంత్యో యత్నతశ్చ తాన్ || 18

శంభునకు, విష్ణువునకు, నాకు, దేవతలందరికి, మునులకు పాద్య జలమీయబడెను (15). హిమవంతుడు బంధువులతో గూడి అందరినీ మండపములోపల ప్రేమతో కూర్చుండబెట్టెను (16). పర్వతుడు వారిని మధురమగు వివిధ భక్ష్యములతో తృప్తిపరచెను. శంభుడు, విష్ణువు, నేను, ఇతరులు అందరు భుజించితిమి (17). అపుడు పురస్త్రీలు నవ్వుతూ మృదువగు మాటలతో వారిని పరిహాసము చేసి వారిని చూస్తూ ఆనందించిరి (18).

తే భుక్త్వా చమ్య విధివద్గిరిమామంత్ర్య నారద | స్వస్థానం ప్రయయుస్సర్వే ముదితాస్తృప్తి మాగతాః || 19

ఇత్థం తృతీయే ఘస్రేeôపి మానితాస్తేeôభవన్మునే | గిరీశ్వరేణ విధివద్దానమానాదరాదిభిః || 20

చతుర్థే దివసే ప్రాప్తే చతుర్థీ కర్మ శుద్ధితః | బభూవ విధివద్యేన వినా ఖండిత ఏవ సః || 21

ఉత్సవో వివిధశ్చాసీత్ సాధువాద జయధ్వనిః | బహుదానం సుగానం చ నర్తనం వివిధం తథా || 22

ఓ నారదా! వారందరు భుజించి, యథావిధిగా ఆచమనమును చేసి, పర్వతుని అనుమతిని పొంది సంతుష్టులై ఆనందించి తమ స్థానమును చేరుకొనిరి (19). ఓ మహర్షీ! ఇదే తీరున మూడవనాడు కూడా ఆ పర్వతరాజు వారికి యథావిధిగా వస్తువలనిచ్చి, ఆదరమును చూపి సన్మానించెను (20) నాల్గవనాడు శుద్ధిగా యథావిధిగా చతుర్థీకర్మ ఆచరింపబడెను. దీనిని ఆచరించనిచో వివాహయజ్ఞము భగ్నమగును (21). అపుడు వివిధములగు

ఉత్సవములు జరిగినవి. సాధువాదము, జయధ్వనులు మిన్నుముట్టినవి. అనేక దానములు చేయబడెను. నృత్యములు, వివిధ గానములు ప్రవర్ధిల్లెను (22).

పంచమే దివసే ప్రాప్తే సర్వే దేవా ముదాన్వితాం | విజ్ఞప్తిం చక్రిరే శైలం యాత్రార్థ మతి ప్రేమతః || 23

తదాకర్ణ్య గిరీశశ్చోవాచ దేవాన్ కృతాంజలిః | కియద్దినాని తిష్ఠంతు కృపాం కుర్వంతు మాం సురాః || 24

ఇత్యుక్త్వా స్నేహతస్తాంశ్చ ప్రభుం విష్ణుం చ మాం పరాన్ | వాసయామాస దివసాన్ బహూన్నిత్యం సమాదరాత్ || 25

ఇత్థం వ్యతీయుర్దివసా బహవో వసతాం చ తత్ర| సప్తర్షీన్ ప్రేషయామాసుర్గిరీశాంతే తతస్సురాః || 26

అయిదవ రోజు ఉదయమే దేవలందరు అత్యానందముతో, అతి ప్రేమతో హిమవంతునకు తిరుగు యాత్ర గురించి విన్నవించిరి (23). ఆ మాటను విని హిమవంతుడు చేతులు జోడించి దేవతలతో 'ఓ దేవతలారా! దయచేసి మరికొన్ని రోజులు ఉండుడు' అని కోరెను (24). ఇట్లు పలికి ఆయన ప్రేమతో వారిని, శివుని, విష్ణువును, నన్ను, ఇతరులను చాల రోజులు అక్కడనే నిలిపివేసి, నిత్యము గొప్ప ఆదరమును చూపెను (25). అక్కడ నివసించి యుండగనే వారికి అనేక దినములు ఈ తీరున గడిచి పోయినవి. తరువాత దేవతలు పర్వతరాజు వద్దకు సప్తర్షులను పంపిరి (26).

తే తం సంబోధయమాసుర్మేనాం చ సమయోచితమ్ | శివతత్త్వం పరం ప్రోచుః ప్రశంసన్ విధివన్ముదా || 27

అంగీకృతం పరేశేన తత్తద్బోధనతో మునే | యాత్రార్థ మగమచ్ఛంభుఃశైలేశం సామరాదికః || 28

యాత్రాం కుర్వతి దేవేశే స్వశైలం సామరే శివే | ఉచ్చై రురోద సామేనా తమువాచ కృపానిధిమ్ || 29

వారు మేనకు సమయోచితముగా పరమ శివతత్త్వమును యథావిధిగా బోధించి ఆమెను ఆనందముతో ప్రశంసించిరి (27). ఓమునీ! వారు వారు చెప్పగా పరమేశ్వరుడు యాత్రకు అంగీకరించి దేవతలు మొదలగు వారితో గూడి హిమవంతుని వద్దకు వళ్లెను (28). దేవ దేవుడు అగు శివుడు దేవతలతో గూడి యాత్రకు సంసిద్ధమగు చుండగా ఆ మేన బిగ్గరగా విలపించి దయానిధి యగు శంభునితో నిట్లనెను (29).

మేనోవాచ |

కృపానిధే కృపాం కృత్వా శివాం సంపాలయిష్యసి | సహస్ర దోషం పార్వత్యా ఆశుతోషః క్షమిష్యసి || 30

త్వత్పదాంబుజ భక్తా చ మద్వత్సా జన్మజన్మని | స్వప్నే జ్ఞానే స్మృతిర్నాస్తి మహాదేవం ప్రభుం వినా || 31

త్వద్భక్తి శ్రుతి మాత్రేణ హర్షాశ్రు పులకాన్వితా | త్వన్నిందయా భ##వేన్మౌనా మృత్యుంజయ మృతా ఇవ || 32

మేన ఇట్లు పలికెను -

ఓ దయానిధీ! నీవు దయచేసి పార్వతిని చక్కగా పాలించుము. తేలికగా సంతసించు నీవు ఆపార్వతి యొక్క వేయి దోషములను క్షమించుము (30). నా కుమార్తె జన్మ జన్మల యందు నీ పాదపద్మములపై భక్తి కలిగి యుండెను. ఆమె తెలివిగా ఉన్ననూ, కలగన్ననూ ఆమె స్మృతిలో మహాదేవ ప్రభుడు లేని కాలము లేదు (31). ఆమె నీ భక్తి గురించి విన్నంత మాత్రాన ఆనందముతో కన్నీరు గార్చెడిది. శరీరము గగుర్పొడిచెడిది. ఓ మృత్యుంజయా ! నిన్ను నిందించినచో ఆమె మరణించిన దానివలె మౌనముగ నుండెడిది (32).

బ్రహ్మోవాచ |

ఇత్యుక్త్వా మేనకా తస్మై#్మ సమర్ప్యస్య స్వసుతాం తదా | అత్యుచ్చం రోదనం కృత్వా మూర్చా మాప తయోఃపురః || 33

అథ మేనాం బోధయిత్వా తామామంత్ర్య గిరిం తథా | చకార యాత్రాం దేవైశ్చ మహోత్సవ పురస్సరమ్ || 34

అథ తే నిర్జరాస్సర్వే ప్రభుణా స్వగణై స్సహ | యాత్రాం ప్రచక్రిరే తూష్ణీం గిరిం ప్రతి శివం దధుః || 35

హిమాచలపురీ బాహ్యోపవనే హర్షితాస్సురాః | సేశ్వరా స్సోత్సవాస్తస్థుః పర్యైషంత శివాగమమ్ || 36

బ్రహ్మ ఇట్లు పలికెను-

మేనక ఇట్లు పలికి అపుడు తన కుమార్తెను ఆయనకు సమర్పించి బిగ్గరగా రోదించి వారిద్దరి యెదుట మూర్చిల్లెను (33). అపుడు ఆ మేనకు తెలివి వచ్చునట్లు చేసి శివుడు మేనా హిమవంతుల అనుమతిని పొంది దేవతలతో గూడి మహోత్సవముతో యాత్రను చేసెను (34). అపుడా దేవతలందరు శివుని గణములతో కూడి యాత్రను మొదలిడిరి. వారు మౌనముగా హిమవంతునకు మంగళాశాసనమును చేసిరి (35). హిమవంతుని నగరము యొక్క బాహ్యో ద్యానవనమునందు దేవతలు శివునితో గూడి ఉత్సాహముతో ఆనందముతో వేచియుండిరి. వారు పార్వతి రాకను ప్రతీక్షించుచుండిరి (36).

ఉత్యుక్తా శివసద్యాత్రా దేవైస్సహ మునీశ్వర | ఆకర్ణయ శివాయాత్రాం విరహోత్సవ సంయుతామ్ || 37

ఇతి శ్రీ శివ మహాపురాణ   రుద్రసంహితాయాం పార్వతీ ఖండే శివయాత్రా వర్ణనం నామ త్రిపంచాశత్తమోeôధ్యాయః (53.

ఓ మహర్షీ! దేవతలతో గూడిన శివుని యాత్రను ఇంత వరకు వర్ణించితిని. వియోగ దుఃఖముతో మరియు ఆనందముతో కలిసియున్న పార్వతి యాత్రను ఇపుడు వినుము (37).

శ్రీ శివ మహాపురాణములోని రుద్ర సంహితయందు పార్వతీ ఖండలో యాత్రను వర్ణించే ఏబదిమూడవ అధ్యాయము ముగిసినది (53).